ప్రచురణ

ప్రొఫెసర్. రమ మేల్కొటే
హైదరాబాద్ ఫోరమ్ ఫర్ తెలంగాణ
8/156, 3వ మెయిన్, 6వ క్రాస్ రోడ్
సైనిక్‌పురి, సికింద్రాబాద్ - 500 094
email : ramamelkote@yahoo.com

# హైదరాబాద్ ఎవరిది?

## కల్పిత కథలు, యథార్థాలు, వాస్తవాలు

హైదరాబాద్ ఫోరం ఫర్ తెలంగాణ
డిసెంబర్ 2009

# హైదరాబాద్ ఫోరం ఫర్ తెలంగాణ

## హైదరాబాద్ ఎవరిది?

### కల్పిత కథలు, యదార్థాలు, వాస్తవాలు

డిసెంబర్ 9, 2009వ తేదీన తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు సంబంధించిన ప్రక్రియ ప్రారంభమవుతుందని హోమ్‌మంత్రి పి.చిదంబరం ప్రకటన చేయగానే, హైదరాబాద్ గురించీ, దాని అభివృద్ధి గురించీ చెబుతూ అదంతా తమ ఘనతే అని కొందరు చెప్పుకొన్నారు. ఇలా చెప్పుకోవడం అంటే, వర్తమానాన్నీ, చారిత్రక వాస్తవాల్నీ వక్రీకరించడమే. చరిత్రలో రికార్డు అయిన యదార్థాలను ప్రజల ముందుకు తీసుకురావడం ద్వారా, ఆ తప్పుడు అభిప్రాయాలను సరిచేయ వలసిన తక్షణ అవసరం మనముందుకొచ్చింది. అందువల్ల వివిధ అంశాల్ని సహేతుకంగా, ప్రజాస్వామికంగా చర్చించుకొనేందుకు అనువైన వాతావరణం ఏర్పడుతుంది. అలాంటి ప్రక్రియను ప్రారంభించేందుకు మేము యదార్థాలను మీ ముందు వుంచుతున్నాం.

**మొదటి ప్రశ్న : హైదరాబాదు నగరాన్ని ఎవరు నిర్మించారు?**

**సమాధానం :** ప్రపంచంలోని అత్యుత్తమ నగరాలకు ధీటుగా హైదరాబాద్‌ను ఒక ఆధునిక నగరంగా నిర్మించడానికి నిజాం ప్రభుత్వం, భూస్వామ్య పాలక వర్గాలూ నిర్ణయం తీసుకోవడం వాస్తవమే. అయితే, దానికి కావలసి వనరులు సమకూర్చింది మాత్రం గతంలోని హైదరాబాద్ రాష్ట్రంలోని కష్టజీవులే. హైదరాబాద్ రాష్ట్రంలోని 90 శాతానికి పైగా ఆదాయం గ్రామీణ ఆర్థిక వ్యవస్థ నుంచి వచ్చింది. ఈ ఆదాయంలో గణనీయమైన భాగాన్ని హైదరాబాద్ నగరానికి అవసరమైన మౌలిక వసతుల కల్పనకూ, సేవకులకూ ఖర్చు చేశారు. అందువల్ల, తెలంగాణ ప్రజల చెమట, రక్తాలతో హైదరాబాద్ నగరం ఏర్పడింది అని చెప్పడం వాస్తవం అవుతుంది.

దాదాపు 100 సంవత్సరాలకు పైగా ప్రవహించిన పెట్టుబడులతో హైదరాబాద్ నగరం తీర్చిదిద్దడం జరిగింది. 1909 నాటికే హైదరాబాద్ ఒక ఆధునిక నగరంగా ఏర్పడిందనే విషయం కింద ఇచ్చిన గణాంకాల ద్వారా అర్థమవుతుంది.

**వంద సంవత్సరాల క్రితం హైదరాబాద్ ఎలా వుంది?**

1909లో ఇండియా ఇంపీరియల్ గెజెటీర్ సమర్పించిన నివేదిక ప్రకారం హైదరాబాద్ భారతదేశంలోని అతిపెద్ద నగరాల్లో 4వ స్థానంలో వుంది. 1901లో ఈ నగరపు జనాభా 4.5 లక్షలు. 1909 నాటికి ఈ సంఖ్య 5 లక్షలకు చేరింది. నిజాం రాష్ట్ర రైలు మార్గాల ద్వారా హైదరాబాద్ నగరం భారతదేశంలోని ఇతర ప్రాంతాలతో అనుసంధానింప బడింది. 1909లో హైదరాబాద్ నగర జనసంఖ్య ఢిల్లీ జనసంఖ్యకన్నా ఎక్కువ. 1956 నాటికే హైదరాబాద్ దేశంలోని అతిపెద్ద నగరాల్లో 4వ స్థానంలో వుంది.

అప్పట్లో ఈ నగరంలో 139 పెద్ద చెరువులు, 310 చిన్న చెరువులు వుండేవి. మూసీనది మీద అనేక డ్యాములు వుండేవి. వ్యవసాయానికి అవసరమైన నీటిపారుదల అవసరాల్ని కూడా ఈ నది తీర్చేది. నగరానికి అవసరమైన రక్షిత మంచినీరు హుస్సేన్‌సాగర్ నుంచీ, మీర్ ఆలం చెరువు నుంచీ లభించేది. అప్పటికే 'హైదరాబాద్ జలమండలి' ఏర్పడివుంది. 'గతంలో ప్రతి సంవత్సరం కలరా వంటి అంటువ్యాధులు హైదరాబాద్ ప్రజల మీద దాడిచేసేవి. అయితే రక్షిత మంచినీటి సరఫరావల్ల పారిశుధ్యం మెరుగుపడింది. అందువల్ల, గతంలో కొన్ని సంవత్సరాలుగా ఈ వ్యాధుల జాడలేదు' అని గెజెటీర్ 1909 నివేదికలో పేర్కొంది.

నిజాం ప్రభుత్వ ప్రధాన మంత్రి సర్ సాలార్‌జంగ్ హైదరాబాద్ నగరంలో ఆధునిక పరిపాలనా వ్యవస్థను ప్రవేశపెట్టాడు. హైదరాబాద్‌లో వివిధ రకాల పాలనా బాధ్యతల్ని స్వీకరించాల్సిందిగా ఇరుగుపొరుగు ప్రాంతాల్లోనూ, ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోనూ వున్న పాలనాధికారుల్ని ఆయన ఆహ్వానించాడు. 1868లో 'పబ్లిక్ వర్క్స్ డిపార్ట్‌మెంట్' ఏర్పడింది. 1869లో మునిసిపాలిటీ పరిపాలనా విధానం ప్రవేశపెట్టబడింది. ఆస్తులు, రవాణా, నీటి సరఫరాలే కాకుండా రహదారులు, భవనాలు వంటి వాటి నుంచి పన్నుల్ని వసూలు చేసేందుకు శిస్తు వసూలు వ్యవస్థ ఏర్పడింది. నగరాభివృద్ధిలో



భాగంగా మునిసిపల్ పాలక వ్యవస్థ హైదరాబాద్‌లో అనేక ప్రజాభవనాల్ని, ఆసుపత్రుల్ని, ఉద్యానవనాల్ని నిర్మించింది.

1909లోని ఇంపీరియల్ గెజెటీర్ ఇంకా ఇలా చెబుతుంది. "రోడ్ల వెడల్పు కార్యక్రమం ఇప్పటికే మొదలైంది. మున్సిపాలిటీ అత్యంత శ్రమతో పాత వీధుల్నీ, సందుగొందుల్ని వెడల్పు చేసింది. అంతేకాదు, సర్ సాలార్‌జంగ్ మంత్రిత్వ ఆధ్వర్యంలో నూతన భవనాల్ని నిర్మించడంతో పాటు నగరంలోని మూడు వంతుల ప్రాంతాన్నీ, నగర శివార్లను నవీకరించడం జరిగింది".

హైదరాబాద్‌లో ఆవిరితో నడిచే రంపపుమిల్లు, ప్రభుత్వ, ప్రభుత్వేతర యాజమాన్యాల కింద అనేక బట్టల మిల్లులు, చేనేత మిల్లులు ఏర్పడడం మూలంగా 1909 నాటికే పారిశ్రామీకరణ ప్రారంభమైంది.[1] ఇక విద్యా రంగానికి వస్తే, 3 కాలేజీలు, అనేక ఇంగ్లీష్ మీడియం స్కూళ్ళూ, ప్రాంతీయ భాషల పాఠశాలలూ నెలకొల్పబడ్డాయి. అప్పటికే రెసిడెన్సీ కేంద్రంగా సికింద్రాబాద్ కంటోన్మెంట్ ప్రాంతం దేశంలోనే అతిపెద్ద మిలిటరీ స్టేషన్ గా హైదరాబాద్‌లో వుండింది.

వంద సంవత్సరాల క్రితం వున్న ఈ వాస్తవాల ఆధారంగా హైదరాబాద్ గురించి తరచుగా వినిపిస్తున్న కొన్ని ప్రశ్నలకు ఈ కరపత్రం సమాధానాలు ఇస్తుంది.

**రెండవ ప్రశ్న : హైదరాబాద్ నగరాభివృద్ధికి కారణాలేమిటి? ఇతర ప్రాంతాల వారు దీనికి చేసిన దోహదం ఏమిటి?**

**సమాధానం :** మనం నిజాయితీగా విషయాన్ని పరిగణనలోకి తీసుకొంటే గడచిన 50 ఏళ్ళలో హైదరాబాద్ 4వ స్థానం నుంచి 5వ స్థానానికి పడిపోయింది.

---

*వివరణ 1 : ఆసక్తికరమైన విషయం ఏమిటంటే దమాస్కస్‌లో ప్రాచుర్యం పొందిన కత్తుల తయారీలో వాడే "ఒరిజినల్ దమాస్కస్ స్టీల్"ను తెలంగాణ నుంచే దిగుమతి చేసుకొనే వాళ్ళని లోహశాస్త్ర పరిశోధనా చరిత్ర చెబుతుంది. ఆ లోహాన్ని తయారు చేయడంలో "హైదరాబాద్ విధాయిత (process)" ను వాడేవాళ్ళు. అరబ్ చారిత్రక వాస్తవాల ప్రకారం "హింద్వి", "తెలింగ్" కత్తులకు ఎక్కువ విలువ వుండేది. ప్రవక్త మహమ్మద్ వాడిన ఖడ్గం కూడా ఈ స్టీల్ నుంచే తయారయిందని చెబుతారు.*

*(వివరాలకు www.indcultureo.tripod.com/telingsteel.html ను చూడండి).*

అయినప్పటికీ ఆంధ్ర ప్రాంతం నుంచి ప్రజలు పెద్దయెత్తున హైదరాబాద్ రావడానికి ప్రధాన కారణం హైదరాబాద్ సంపన్న నగరంగా ఎదగుతుండటమే.

అప్పట్లో హైదరాబాద్‌లో ఉచితంగానో అతితక్కువ ధరలతోనో విస్తారమైన భూమి అందుబాటులో వుండింది. దాదాపు 2000 చదరపు మైళ్ళ (5,200 చదరపు కిలోమీటర్లు లేదా 13,00,000 ఎకరాలు) విస్తీర్ణంలోని రాజమాన్యాలు (సర్ఫ్-ఎ-ఖాస్) అయిన భూములు నగర అంతర్భాగం (అత్రాఫ్-ఇ-బల్దా)గా చుట్టూ వున్నాయనేది ఒక చారిత్రక వాస్తవం. తేనె తేనెటీగల్ని ఆకర్షించినట్టుగా, ఈ భూములు, కోస్తా ప్రాంతంలోని రైతుల్ని, వ్యాపార వర్గాల్ని ఆకర్షించాయి. 1950, '60దశాబ్దాలలో ప్రభుత్వ వుద్యోగులు, ప్రభుత్వంతో వర్తక వాణిజ్యాలు నడిపే వ్యాపారులు, ఇతర సాహసులైన కొంతమంది ప్రజలకు మాత్రమే ఈ ఆకర్షణ పరిమితమైంది.

ఒక ప్రత్యేకమైన ఘోరమైన పరిస్థితి నెలకొన్న దశ ఏమిటంటే, పట్టణ భూగరిష్ట చట్టం రావడం వల్ల, ముస్లిం ప్రజలు తమ భూముల్ని కోల్పోవలసి రావడం. అనేక ముస్లిం కుటుంబాలు నామమాత్రపు ధరలకే తమ ఆస్తుల్ని అమ్ముకొన్నాయి. ఇవాళ ఫైవ్‌స్టార్ హోటళ్ళు, బడామాల్స్ నెలకొని వున్న బంజారాహిల్స్ ఏరియాలోని భూముల్ని ఈ దశలోనే ముస్లింలు తెగనమ్ముకోవాల్సిన దౌర్భాగ్యం వచ్చింది. ఈ భూములు నూతనంగా నగరంలో స్థిరపడిన వారి చేతుల్లోకి మారాక వాటికి క్రమబద్ధీకరణ లభించింది.

1969లో వచ్చిన తెలంగాణ ఉద్యమాన్ని క్రూరంగా అణచివేయటం, సమైక్య ఆంధ్రను మళ్ళీ గట్టిగా నిలబెట్టడంతో, కోస్తావాళ్ళ రాజకీయ ఆధిపత్యం ప్రయోజనాలు సెటిలర్లకు గేట్లను బార్లాతెరిచాయి.

1956 నాటికే హైదరాబాద్ ఆర్థికంగా అభివృద్ధి చెందడానికి అవసరమైన అన్ని దినుసులూ సమకూరి వున్నాయనే విషయాన్ని అందరూ గుర్తుపెట్టుకోవాలి. నగరంలో అప్పటికే పరిశ్రమలు వున్నాయి. అజామాబాద్‌లో, సనత్‌నగర్‌లో పారిశ్రామిక వాడలు ఏర్పడి వున్నాయి. వ్యూహాత్మంగా, భౌగోళికంగా చూసినపుడు హైదరాబాద్ మనదేశపు నడిబొడ్డున వుండటం, నగరం చుట్టూ విస్తారంగా వున్న ప్రభుత్వ భూమి మూలంగా, కేంద్ర ప్రభుత్వం అనేక ప్రభుత్వ రంగపరిశ్రమల్ని నెలకొల్పింది.



ప్రాగాటూల్స్, ఇసిఐఎల్, బిహెచ్ఇఎల్, ఐడిపిఎల్, హెచ్ఏఎల్, హెచ్.యం.టి వంటివి దీనికి కొన్ని ఉదాహరణలు. ఇలాంటివే కాకుండా, డిఆర్‌డిఎల్, డిఆర్‌డిఎ, ఎన్ఆర్ఎస్ఎ వంటి సాంకేతిక రక్షణ రంగ సంస్థలకి కూడా హైదరాబాద్ సహజ వేదిక అయ్యింది.

సాంకేతిక పరిజ్ఞానపు బదిలీలవల్ల, ఈ పరిశ్రమలు అనేక ఇతర పరిశ్రమల స్థాపనకు దోహదమయ్యాయి. ఐడిపిఎల్, ఇసిఐఎల్, ఎన్ఆర్ఎస్ఎ వంటి కొన్ని ప్రభుత్వరంగ సంస్థలు అందించిన ప్రోత్సాహం కారణంగా ఔషధ సమాచార సాంకేతిక రంగాల్లో అనేక పరిశ్రమలు నెలకొల్పటం జరిగిందనేది నిస్సందేహం. ఐడిపిఎల్ నుంచి అందిన సాంకేతిక సహాయం, విధాయితల తోడ్పాటుతోనే డాక్టర్ రెడ్డీల్యాబ్స్ అభివృద్ధి చెందింది. ఇసిఐఎల్, ఎన్ఆర్ఎస్ఎలు అభివృద్ధి పరచిన సాంకేతిక సామర్థ్యాల సహాయంతో అమెరికాతో శాటిలైట్ అనుసంధానాన్ని ఏర్పరచిన మొట్టమొదటి భారతీయ కంపెనీ సత్యం కంప్యూటర్స్. ఈ కంపెనీలన్నీ హైదరాబాద్‌లో తప్ప మరెక్కడా స్థాపించేందుకు అనుకూల పరిస్థితులు ఆనాడు లేవు.

రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల వారు హైదరాబాద్‌లో అనేక విజయవంతమైన సంస్థల్నీ, వ్యాపారాల్నీ నెలకొల్పడం వాస్తవమే. తమ ప్రయోజనాలకు అనుకూలంగా రాజ్యయంత్రాంగాన్నీ, ఇతర ప్రభుత్వ అంగాల్నీ ప్రభావితం చేయగల 'అత్యున్నత' తెలివితేటలూ, నైపుణ్యాలూ వీళ్ళకి వుండటం వల్ల, వీళ్ళు మార్కెట్‌లో ఆధిపత్యాన్ని సాధించగలిగారు. నిజానికి దుందుడుకుగా ఆధిపత్యం చెలాయిస్తున్న ఈ సీమాంధ్ర సంస్కృతి నుంచి తమను తాము రక్షించుకోవాలన్న ఆకాంక్షే ప్రత్యేక తెలంగాణ డిమాండు కొనసాగడానికి వున్న ముఖ్య కారణాలలో ఒకటి.

**మూడవ ప్రశ్న : గత దశాబ్దంలో హైదరాబాద్‌లో జరిగిన అత్యున్నత స్థాయి అభివృద్ధికి ఆంధ్రప్రాంతం నుంచి వచ్చిన రాజకీయ, వ్యాపార వర్గాల నాయకత్వపు దూరదృష్టే కారణమా?**

20వ దశాబ్దంలో హైదరాబాద్ నగర అభివృద్ధికి, హైదరాబాద్ రాష్ట్ర రైతులు చెల్లించిన పన్నులు ప్రధాన కారణం అన్నది వాస్తవం అయితే, 21వ శతాబ్దంలో మొదటి దశాబ్దంలోని ఈ నగరాభివృద్ధికి పైవాస్తవం కారణమని చెప్పలేము. నగరం

భౌతికంగా విస్తరించడానికి అవసరమైన మౌలిక వసతుల కల్పనకు ప్రభుత్వం రాష్ట్ర ఆదాయం నుంచి పెద్దయెత్తున పెట్టుబడులు పెట్టిందని చాలామంది చెప్తున్నారు. ఇంత అవాస్తవికమైన విషయం ఇంకొకటి లేదు. 'రియల్ఎస్టేట్ మూలంగా వచ్చిన నగరాభివృద్ధి'కి ప్రధానంగా రాష్ట్ర ప్రభుత్వ భూముల్ని (గతంలో ఇవి రాజమాన్యాలు) క్రౌన్ ల్యాండ్స్ అమ్మగా వచ్చిన ఆదాయమే కారణం. ప్రభుత్వ భూముల అమ్మకం ద్వారా 12,000 కోట్లను ఆర్జించాలని హుడా పథకాలు వేసింది. ఈ నిధుల్ని మౌలిక వసతుల అభివృద్ధికి వెచ్చించాలని దాని సంకల్పం.

దీంతో పాటు అధికారంలో వున్న వాళ్లు రెవెన్యూ రికార్డుల్ని తారుమారు చేసి, పెద్ద ఎత్తున ప్రభుత్వ భూముల్ని కబ్జా చేశారు. ఇలా ప్రభుత్వాన్ని తమకు అనుకూలంగా వాడుకొని ఆస్తులు ఆక్రమించిన వుదాహరణలు కోకొల్లలు:

- రామోజీ ఫిలింసిటీ, సాంఘీగ్రూప్ వాళ్ళు పొందిన భూములు. గాంధీ మెడికల్ కాలేజికి చెందిన భూముల్ని ఒక మాల్ నిర్మాణం కోసం ఒక రియల్ ఎస్టేట్ డెవలపర్‌కి అప్పగించారు. ఈమొత్తం లావాదేవిల్లో చాలా లుకలుకలు దాగి వున్నాయి.
- భూముల అమ్మకాలు, లీజులతో పాటుగా ఈ రియల్ ఎస్టేట్ డెవలపర్లు, సిటీలోని చెరువుల భూముల్ని ఆక్రమించుకోవడానికి అనువుగా, వాటిని నీళ్ళు లేకుండా ఎండబెట్టేశారు. దీనిఫలితంగా మూసీనది మురికి నీటి కాలువగా మారిపోయింది. ఇంత కన్నా ఘోరం ఏమిటంటే, "అభివృద్ధి" పేరుమీదుగా జరిగిన ఈ ఆక్రమణల మూలంగా నగరానికి తాగు నీటిని అందించే ఉస్మాన్‌సాగర్ (గండిపేట),హిమాయత్‌సాగర్ చెరువులు కూడా ఎండిపోయాయి. ఉమ్దాసాగర్, తలాబ్‌మీర్‌జుమ్లా, (దీన్ని తలాబ్ కట్ట అనికూడా అంటారు. హైదరాబాద్ సంస్థానం ప్రధానమంత్రి పేరు మీద దీనికి ఆ పేరు వచ్చింది) దుర్గం చెరువు వంటివి మాయమై పోయిన మరికొన్ని మంచినీటి చెరువులు.
- నగర శివార్లలోని రైతుల భూముల్ని స్వాధీనం చేసుకుంటామని ప్రభుత్వసంస్థల నోటిఫికేషన్లు వచ్చిన తర్వాత కనీసం అరడజను సంఘటనల్లో చిన్న, మధ్య తరగతి రైతులు తమ వందలాది ఎకరాల భూముల్ని గత్యంతరం లేక తెగనమ్ముకొన్న విషయాలు వెలుగు చూశాయి. ఈ భూముల్ని కొన్న దళారులు ఆ తర్వాత నోటిఫికేషన్లను రద్దు చేయించి పెద్ద ఎత్తున లాభాల్ని ఆర్జించారు.
- ఒక రిటైర్డ్ టీచరు ఆకుల రాజయ్య 5,000 ఎకరాలకు పైగా భూముల రిజిస్ట్రేషన్లలో భాగమయ్యాడంటే, రామలింగరాజుకు చెందిన సత్యం కంప్యూటర్ల కంపెనీ దాదాపు 250 బినామీ కంపెనీల పేరుమీద వేలాది ఎకరాల భూముల్ని కొనుగోలు చేసిందంటే, ఇంతకన్నా నిదర్శనం ఇంకేం కావాలి?

ఆ బూమ్ పీరియడ్‌లో కొంతమంది బడాబాబుల భూఆక్రమణల సామర్థ్యాల మూలంగా అంతర్జాతీయ పెట్టుబడి వచ్చి పడింది. ఫలితంగా 'ప్రభుత్వ-ప్రైవేటు భాగస్వామ్యాలు' 'స్పెషల్ ఎకనామిక్‌జోన్లు' (ఎస్.ఇ.జడ్) వచ్చాయి. మంచి లాభాల నిచ్చే తన ఐటీ వ్యాపారం నుంచి నిధుల్ని భూముల్ని కొనుగోలు చేయడానికి దారి మళ్ళించాలనే రామలింగరాజు అత్యాశమూలంగానే సత్యం కుంభకోణం జరిగిందంటే, భూముల నుంచి ఎంత పెద్దయెత్తున లాభాలు గడించవచ్చో అర్థమవుతుంది. మౌలిక వసతుల కల్పనా రంగంలో (ఇన్‌ఫ్రాస్టర్ రంగం) దేశంలో వున్న 35 కంపెనీలలో 27 ఆంధ్రప్రదేశ్ కు చెందినవి. ఇందులో తెలుసుకోవలసింది ఏమిటంటే, ఇందులో ఒకటి కూడా తెలంగాణ ప్రాంతానికి చెందిన వారిది లేదు. రియల్ ఎస్టేట్ బుడగ సృష్టించిన హైదరాబాద్ నగారాభివృద్ధి ఏ స్థాయికి వెళ్ళిందో, కింది విషయాల్ని చూస్తే తెలుస్తుంది.

పాత హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్‌కు చెందిన ఏరియా 175 చదరపు కిలోమీటర్లు వుంటే, ఇవాళ అడ్డదిడ్డంగా పెరిగిన నగరం 6,876 చదరపు కిలోమీటర్లకు విస్తరించింది. ఈ నగరీకరణ హైదరాబాద్ చుట్టు పక్కల వున్న జిల్లాల్లోని 666 గ్రామాలతో కూడిన 54 మండలాల్ని మింగివేసింది.

ఔటర్ రింగురోడ్డు 48 గ్రామాలగుండా పోతుంది. దీనికోసం 7,000 ఎకరాల్ని స్వాధీనం చేసుకొన్నారు. ఈరోడ్డుకు సమీపంలో వున్న దాదాపు 17,000 ఎకరాల్లో మెజారిటీ భాగం రాయలసీమ, ఆంధ్రప్రాంతాలకు చెందిన దళారుల చేతుల్లోనే వుంది. సినీరంగ ప్రముఖులైన మురళీమోహన్ అధీనంలో 3000 ఎకరాలు, విశ్వనాథ్ అధీనంలో 1000 ఎకరాలు వున్నాయనే వదంతులు వున్నాయి.

భౌతికంగా విస్తరించడానికి అవసరమైన మౌలిక వసతుల కల్పనకు ప్రభుత్వం రాష్ట్ర ఆదాయం నుంచి పెద్దయెత్తున పెట్టుబడులు పెట్టిందని చాలామంది చెప్తున్నారు. ఇంత అవాస్తవికమైన విషయం ఇంకొకటి లేదు. 'రియల్ఎస్టేట్ మూలంగా వచ్చిన నగరాభివృద్ధి'కి ప్రధానంగా రాష్ట్ర ప్రభుత్వ భూముల్ని (గతంలో ఇవి రాజమాన్యాలు) (క్రౌన్ ల్యాండ్స్) అమ్మగా వచ్చిన ఆదాయమే కారణం. ప్రభుత్వ భూముల అమ్మకం ద్వారా 12,000 కోట్లను ఆర్జించాలని హుడా పథకాలు వేసింది. ఈ నిధుల్ని మౌలిక వసతుల అభివృద్ధికి వెచ్చించాలని దాని సంకల్పం.

దీంతో పాటు అధికారంలో వున్న వాళ్లు రెవెన్యూ రికార్డుల్ని తారుమారు చేసి, పెద్ద ఎత్తున ప్రభుత్వ భూముల్ని కబ్జా చేశారు. ఇలా ప్రభుత్వాన్ని తమకు అనుకూలంగా వాడుకొని ఆస్తులు ఆక్రమించిన వుదాహరణలు కోకొల్లలు:

- రామోజీ ఫిలింసిటీ, సాంఘీగ్రూప్ వాళ్ళు పొందిన భూములు. గాంధీ మెడికల్ కాలేజికి చెందిన భూముల్ని ఒక మాల్ నిర్మాణం కోసం ఒక రియల్ ఎస్టేట్ డెవలపర్‌కి అప్పగించారు. ఈమొత్తం లావాదేవిల్లో చాలా లుకలుకలు దాగి వున్నాయి.
- భూముల అమ్మకాలు, లీజులతో పాటుగా ఈ రియల్ ఎస్టేట్ డెవలపర్లు, సిటీలోని చెరువుల భూముల్ని ఆక్రమించుకోవడానికి అనువుగా, వాటిని నీళ్ళు లేకుండా ఎండబెట్టేశారు. దీనిఫలితంగా మూసీనది మురికి నీటి కాలువగా మారిపోయింది. ఇంత కన్నా ఘోరం ఏమిటంటే, "అభివృద్ధి" పేరుమీదుగా జరిగిన ఈ ఆక్రమణల మూలంగా నగరానికి తాగు నీటిని అందించే ఉస్మాన్‌సాగర్ (గండిపేట),హిమాయత్‌సాగర్ చెరువులు కూడా ఎండిపోయాయి. ఉమ్దాసాగర్, తలాబ్‌మీర్‌జుమ్‌లా, (దీన్ని తలాబ్ కట్ట అనికూడా అంటారు. హైదరాబాద్ సంస్థానం ప్రధానమంత్రి పేరు మీద దీనికి ఆ పేరు వచ్చింది) దుర్గం చెరువు వంటివి మాయమై పోయిన మరికొన్ని మంచినీటి చెరువులు.
- నగర శివార్లలోని రైతుల భూముల్ని స్వాధీనం చేసుకుంటామని ప్రభుత్వసంస్థల నోటిఫికేషన్లు వచ్చిన తర్వాత కనీసం అరడజను సంఘటనల్లో చిన్న, మధ్య తరగతి రైతులు తమ వందలాది ఎకరాల భూముల్ని గత్యంతరం లేక తెగనమ్ముకొన్న



విషయాలు వెలుగు చూశాయి. ఈ భూముల్ని కొన్న దళారులు ఆ తర్వాత నోటిఫికేషన్లను రద్దు చేయించి పెద్ద ఎత్తున లాభాల్ని ఆర్జించారు.

- ఒక రిటైర్డ్ టీచరు ఆకుల రాజయ్య 5,000 ఎకరాలకు పైగా భూముల రిజిస్ట్రేషన్లలో భాగమయ్యాడంటే, రామలింగరాజుకు చెందిన సత్యం కంప్యూటర్ల కంపెనీ దాదాపు 250 బినామీ కంపెనీల పేరుమీద వేలాది ఎకరాల భూముల్ని కొనుగోలు చేసిందంటే, ఇంతకన్నా నిదర్శనం ఇంకేం కావాలి?

ఆ బూమ్ పీరియడ్‌లో కొంతమంది బడాబాబుల భూఆక్రమణల సామర్థ్యాల మూలంగా అంతర్జాతీయ పెట్టుబడి వచ్చి పడింది. ఫలితంగా 'ప్రభుత్వ-ప్రైవేటు భాగస్వామ్యాలు' 'స్పెషల్ ఎకనామిక్‌జోన్లు' (ఎస్.ఇ.జడ్) వచ్చాయి. మంచి లాభాల నిచ్చే తన ఐటీ వ్యాపారం నుంచి నిధుల్ని భూముల్ని కొనుగోలు చేయడానికి దారి మళ్ళించాలనే రామలింగరాజు అత్యాశమూలంగానే సత్యం కుంభకోణం జరిగిందంటే, భూముల నుంచి ఎంత పెద్దయెత్తున లాభాలు గడించవచ్చో అర్థమవుతుంది. మౌలిక వసతుల కల్పనా రంగంలో (ఇన్‌ఫ్రాస్టర్ రంగం) దేశంలో వున్న 35 కంపెనీలలో 27 ఆంధ్రప్రదేశ్ కు చెందినవి. ఇందులో తెలుసుకోవలసింది ఏమిటంటే, ఇందులో ఒకటి కూడా తెలంగాణ ప్రాంతానికి చెందిన వారిది లేదు. రియల్ ఎస్టేట్ బుడగ సృష్టించిన హైదరాబాద్ నగారాభివృద్ధి ఏ స్థాయికి వెళ్ళిందో, కింది విషయాల్ని చూస్తే తెలుస్తుంది.

పాత హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్‌కు చెందిన ఏరియా 175 చదరపు కిలోమీటర్లు వుంటే, ఇవాళ అడ్డదిడ్డంగా పెరిగిన నగరం 6,876 చదరపు కిలోమీటర్లకు విస్తరించింది. ఈ నగరీకరణ హైదరాబాద్ చుట్టు పక్కల వున్న జిల్లాల్లోని 666 గ్రామాలతో కూడిన 54 మండలాల్ని మింగివేసింది.

ఔటర్ రింగురోడ్డు 48 గ్రామాలగుండా పోతుంది. దీనికోసం 7,000 ఎకరాల్ని స్వాధీనం చేసుకొన్నారు. ఈరోడ్డుకు సమీపంలో వున్న దాదాపు 17,000 ఎకరాల్లో మెజారిటీ భాగం రాయలసీమ, ఆంధ్రప్రాంతాలకు చెందిన దళారుల చేతుల్లోనే వుంది. సినీరంగ ప్రముఖులైన మురళీమోహన్ అధీనంలో 3000 ఎకరాలు, విశ్వనాథ్ అధీనంలో 1000 ఎకరాలు వున్నాయనే వదంతులు వున్నాయి.

హైదరాబాద్ ఏర్‌పోర్టు అభివృద్ధిసంస్థ (హాడా) ప్రభుత్వ-ప్రైవేటు భాగస్వామ్యంతో 7టౌన్‌షిప్పుల్ని నిర్మించతలపెట్టింది. ఇందుకోసం మంకల్,నాదర్‌గుల్, ఇంజాపూర్, రాయికుంట, తుర్కయాంజల్, కిస్మత్‌పూర్ గ్రామాలకు చెందిన 800 ఎకరాల్ని కొనుగోలు చేసింది. ఈప్రాజెక్టు ద్వారా 'హాడా' 500 కోట్ల రూపాయల్ని ఆర్జించాలని చూస్తోంది. హైదరాబాద్‌కు ఆనుకొని వున్న భూముల్ని రాజకీయ నాయకులు, దళారీ వ్యాపారులు తమ గుప్పెట్లోకి తెచ్చుకొన్న తర్వాతనే హైదరాబాద్‌లోని హైటెక్‌సిటీ మొదలుకొని, ఔటర్ రింగురోడ్డు, అనేక టౌన్‌షిప్పులు, జియంఆర్ ఎయిర్ పోర్టు వంటి చాలా మెగా ప్రాజెక్టులు ప్రారంభమయ్యాయి.

హైదరాబాద్ శివార్లలోని భూముల్లో తిష్టవేసిన వీళ్ళందరికీ తెలంగాణ ప్రత్యేకరాష్ట్ర ఏర్పాటు ఆశనిపాతంగా పరిణమించిందనటంలో సందేహం లేదు. రియల్‌ఎస్టేట్ బుడగ చిట్లిపోయింది. లెక్కకు మించిన సంఖ్యలోని వీళ్ళ ఆస్తుల్నీ కొనేవాళ్ళే లేకుండా పోయారు.

మళ్ళీ మార్కెట్టు కోలుకొనే దాకా వాళ్ళు భూముల్ని తమ అధీనంలో వుంచుకోవలసి వుంది. ఇవాళ ఈ పిడికెడు మంది (వీళ్ళు కొన్ని డజన్లకన్నా ఎక్కువ మంది లేరు) తెలంగాణా డిమాండ్‌కు వ్యతిరేకంగా చాలా బలంగా నిలబడుతున్నారు. తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే, తమ భూఆక్రమణల మీద విచారణ జరుగుతుందని, ఫలితంగా తమ భూముల్ని కోల్పోవడంతో పాటు ప్రభుత్వాన్ని ప్రజల్ని మోసం చేసినందుకు గాను దోషుల్లా నిలబడాల్సి వుంటుందని వీళ్ళు భయపడుతున్నారు.

ఇదంతా చూసినపుడు ఈ "దూరదృష్టి" కలిగిన పెద్దమనుషులకు ప్రజల అభివృద్ధి కన్నా కొంతమంది ధనవంతుల ప్రయోజనాల్ని కాపాడటమే ధ్యేయమనే అభిప్రాయానికి రాకతప్పదు.

**నాలుగవ ప్రశ్న : తెలంగాణ రాష్ట్రం వస్తే, హైదరాబాద్‌లో నివసిస్తున్న ఇతర ప్రాంతాల ప్రజలమీద ఎటువంటి ప్రభావం పడుతుంది?**

**సమాధానం:** గత రెండు దశాబ్దాలుగా హైదరాబాద్ జనాభా విషయంలో గణనీయమైన మార్పులు చోటుచేసుకొన్నాయి. ఆంధ్రప్రదేశ్‌లోని ఇతర ప్రాంతాల నుంచి శాశ్వతంగా హైదరాబాద్‌లో సెటిల్ అయినవారిలో కొంతమందికి, తెలంగాణ



రాష్ట్రం ఏర్పడితే, ఇప్పటికే ప్రభుత్వం దగ్గరవున్న తమ పలుకుబడి దెబ్బతింటుంది. అయితే మొత్తం జనాభాలో వీళ్ళు మైనారిటీ సంఖ్యలోనే వున్నారు. ఎక్కువమంది ప్రజలు చిన్న చిన్న ఉద్యోగాలు, వ్యాపారాలు చేసుకొనే వాళ్ళు. ప్రభుత్వ అధికారాన్ని తమకోసం వాడుకోవాల్సిన అవసరం వీళ్ళకు పెద్దగా వుండదు. అయినప్పటికీ, హైదరాబాద్ పాలనలో పాల్గొనే హక్కు వీళ్ళందరికీ వుంటుంది.

తెలంగాణ రాష్ట్ర రాజధానిగా హైదరాబాద్ పాత్ర మారవలసి వుంటుంది. పట్టణ ప్రాంతాల్లో స్వపరిపాలనా సూత్రాలు ఇప్పటివరకూ ఆచరణలో విఫలమౌతూనే ఉన్నాయి. అవి ఎంతగా నీరుగారి పోయాయంటే, సాక్ష్యాత్తూ భారతరాజ్యాంగమే అపహాస్యానికి గురవుతున్నది. ప్రస్తుతం హైదరాబాద్‌కు సంబంధించిన అన్ని నిర్ణయాల్ని రాష్ట్ర-స్థాయి రాజకీయ నాయకత్వంతో పాటు సీనియర్ అధికారులే తీసుకుంటున్నారు. హైదరాబాద్ నగరవాసులు, వాళ్ళ ప్రతినిధులైన కార్పొరేషన్ ప్రజాప్రతినిధులు, మేయర్ తో సహా నామమాత్రంగానే మిగిలిపోయారు. వనరుల కేటాయింపుల్లో వాళ్ళపాత్ర వుండటం లేదు.

తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తర్వాత హైదరాబాద్‌లో నివసిస్తున్న ప్రజలు (ఆంధ్రప్రాంతం నుంచి వచ్చి స్థిరపడిన వాళ్ళు కూడా) మరింత స్వయం ప్రతిపత్తి కోసం ముందుకు రావాల్సిన అవసరం వుంది. భారతరాజ్యాంగంలోని 74వ రాజ్యాంగ సవరణ ప్రకారం నగరంలో నివసించే ప్రజలందరి గొంతులు వినిపించాలి.

హైదరాబాద్ నగరం భిన్నసంస్కృతులకు ఆలవాలమనీ, కల్సివుండే స్వభావానికి నిదర్శనం అనే పేరుపొందిందని గుర్తుంచుకోవాలి. ప్రజలు, భాషలు, ప్రజాజీవన విధానాల మేలుకలయిక సమ్మిళితాల ఫలితంగా ఈ నగర సంసృతి రూపుదాల్చింది. ఈ హైదరాబాద్ సంసృతికి 400 యేళ్ళకు పైగా చరిత్రవుంది. దీన్నే "గంగా జమునా" (గంగా, యమునల సంసృతి) అని పిలుస్తారు. హిందూ ముస్లింలతో పాటుగా ఆర్మీనియన్లు, ఆంగ్లోఇండియన్లు, పార్శీలు, షియాలు, ఉత్తరప్రదేశ్‌కు చెందిన కాయస్తులు, సిక్కులు, పంజాబీలు– వీళ్ళంతా నగరంలో ప్రశాంతంగా జీవిస్తున్నారు. వీళ్ళంతా తమను హైదరాబాదీలుగా పిలుచుకుంటారు.

ఇప్పటికీ దక్షిణ భారతదేశంలోనే బహు భాషా సంస్కృతిని నిలుపుకొంటూ దేశంలోని అన్ని ప్రాంతాల వారికి ఆశ్రయమిచ్చే నగరం హైదరాబాద్ ఒక్కటే.

హిందీ మాట్లాడే రాష్ట్రాలు మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్ వంటివి అనేకం వున్నపుడు, తెలుగు మాట్లాడే రాష్ట్రాలు ఒకటికన్నా ఎక్కువ వుంటే నష్టమేంటి? చిన్నరాష్ట్రాల ఏర్పాటుకు అనుకూలంగా తన వాదనల్ని వినిపిస్తూ బి.ఆర్ అంబేద్కర్ ఇలా అంటాడు "... ఒకే భాష-ఒకే రాష్ట్రం అనేది ఎప్పుడూ తప్పని సరేంకాదు. నిజానికి ఒకే భాష, ఒకే రాష్ట్రం అనేది నియమంకావాలి. అందువల్ల ఒక భాషను అనేక రాష్ట్రాలుగా విభజింపవచ్చు."

దురదృష్టవశాత్తూ హైదరాబాద్ నగరం లేదా జిహెచ్‌యంసి కనుక కేంద్ర పాలిత ప్రాంతంగా ఏర్పడితే ఆ ఒక్క చర్య ఫలితంగా పాతబస్తీలో నివసించే దాదాపు 20 లక్షల మంది ముస్లింలు చిక్కుల్లో పడతారు. అప్పుడు హైదరాబాద్ భారతదేశానికి లేదా దక్షిణ ఆసియాకి హైటెక్ హబ్‌గా మారిపోతుంది. దేశం లేదా ప్రపంచం నలుమూలల నుంచి పెద్ద స్థాయిలో జీతాలు తీసుకొనే ప్రొఫెషనల్స్ వచ్చిపడతారు. అప్పుడు ముస్లింలు దారితెన్నులేక మరింత పేదరికంలోకి నెట్టవేయబడతారు. ఈ ముస్లింలు ఆధునికులైన ప్రొఫెషనల్స్ ఇళ్ళల్లో తక్కువ జీతాలకు పనిచేయాల్సి వుంటుంది. దానికిబదులు, హైదరాబాద్ తెలంగాణా రాజధానిగా వుంటే మరింత మంచి పరిపాలనతో పట్టణ గ్రామీణ పేదలు కలసి తమ సంయుక్త ప్రయోజనాలకోసం కృషి చేస్తూ మెల్లమెల్లగా మరింత మెరుగైన, ఆమోదనీయమైన జీవన ప్రమాణాలను సాధించుకోవచ్చు.

**ఐదవ ప్రశ్న : హైదరాబాద్ నగరం నుంచి వచ్చే ఆదాయాన్ని ఎలా పంచుతారు?**

**సమాధానం :** హైదరాబాద్ నగరం తప్పనిసరిగా తెలంగాణ రాజధానిగా వుంటుందని స్పష్టంగా చెప్పటం జరిగింది. వందల సంవత్సరాలుగా ఈ ప్రాంతానికి హైదరాబాదే రాజధానిగా వుంటూవచ్చింది. ఎవరైనా 1956లోకి వెళ్ళిచూస్తే ఆంధ్రప్రదేశ్‌కు హైదరాబాద్‌ని రాజధానిగా ఎందుకు నిర్ణయించారో తెలుస్తుంది. ఆంధ్రప్రాంతం నుంచి వచ్చిన ప్రభుత్వ ఉద్యోగుల కోసం అవసరమయిన ఇళ్లు తప్ప అదనంగా ప్రభుత్వ భవనాలేవీ నిర్మించాల్సిన అవసరం ఏర్పడలేదు. ఆంధ్రప్రదేశ్ రాజధానిగా ఏర్పరచేందుకు హైదరాబాద్‌లో పెద్ద ఎత్తున పెట్టుబడులు పెట్టారని చెప్పడం అభూతకల్పన తప్ప మరేమీలేదు.

అందువల్ల హైదరాబాద్ నుంచి వచ్చే ఆదాయంలో రాష్ట్ర ప్రభుత్వ వాటా తెలంగాణాకే చెందాలి. ఇందులో సందేహాలకు తావులేదు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఏర్పాటు



కోసం జరిగిన పెద్ద మనుషుల ఒప్పందం ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణ కలయిక విజయవంతం కాకపోతే ప్రత్యేక రాష్ట్రంగా విడిపోవచ్చు అనే విషయాన్ని మరువరాదు. 1969లోనే తెలంగాణ గళాన్ని విని అధికారులు రాష్ట్రాన్ని విభజించివుంటే, ఇవాళ ఇంత ఆందోళన వుండేదికాదు.

హైదరాబాద్ నుంచి వచ్చే ఆదాయాలు కోల్పోవలసి వస్తుందని ఇతర ప్రాంతాల వారు భావిస్తే, వాళ్ళు చూడాల్సిన విషయం ఏమిటంటే, మొదటి నుంచి కూడా తెలంగాణ ఆంధ్రప్రదేశ్‌లో అయిష్టంగానే కలసి వుంటూ వచ్చింది. ఈ విషయాన్ని వాళ్ళు ఇప్పటికైనా అర్థంచేసుకుంటే మంచిది.

---